

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం శ్రీ సాయి రాం

# శ్రీ కాళహస్తీశ్వర శతకము

శ్రీకాళహస్తీశ్వర శతకమును వ్రాసిన ధూర్జటి 16వ శతాబ్ధమునాటి వాడు. శ్రీకృష్ణదేవ రాయల వారి భువన విజయములో (ఆస్థానములో) అష్ట దిగ్గజములలో ఒకనిగా వాసి కెక్కిన వాడు చాల కాలము శ్రీకాళహస్తీలో నుండి తరువాత రాయల ఆస్థానమునకు వెళ్ళినను 'రాజులు మత్తుల్' అని రాజులగురించి తిట్టగల ధీశాలి, నిర్భయుడు. ప్రాపంచిక సుఖములను రోసి భక్తితో భగవంతునిమీద శతకము చెప్పినవాడే యితడు.

1. శ్రీ విద్యుత్కలితా జవంజవ మహ జీమూత పాపాంబు ధా
రా వేగంబున మన్మనోజ్ఞ సుముదీర్ణత్వంబు గోల్పోయితిన్
దేవా! మీ కరుణా శరత్సమయ మింతే చాలు, చిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీ కాళహస్తీశ్వరా!

శ్రీకాళహస్తి అనగా సాలెపురుగు, పాము, ఏనుగులకు అక్కడ వెలసిన ఈశ్వరుడు మోక్షము నిచ్చుటచే ఆ దేవునికి శ్రీకాళహస్తీశ్వరుడని పేరు వచ్చినది. ఇటువంటి తిర్యక్కులపైకూడ నీకరుణ వర్షించిన ఓదేవా! సంసార బంధనములనే మబ్బులతో కమ్మిన నామనసును నీ దయతో రక్షింపుము. నాలో భక్తి భావ మనే వెన్నెలను కురిపించి నా హృదయ పద్మమును వికసింప జేయుము. నీ దయను శరత్కాల సమయమున కూడా కొంచెమైనా ప్రసరింపచేయుము.ఎందుకంటే శరత్కాలమున స్వచ్ఛమైన సూర్య కిరణాల చేత తామరలు వికసిస్తాయి.

2. వాణీవల్లభ దుర్లభంబగు భవద్వారంబు నన్నిల్చి, ని
ర్వాణశ్రీ చెరపట్ట చూచిన విచార ద్రోహమో, నిత్య క
ళ్యాణ క్రీడలబాసి, దుర్దశలపాలై, రాజలోకాధమ
శ్రేణి ద్వారముదూర జేసి దిపుడో శ్రీకాళహస్తీశ్వరా.

ఓ ఈశ్వరా! నీ సన్నిధి యందు నిలిచి మోక్షము పొందుటకు మనుసునిలకడ లేనిచో బ్రహ్మకైనా సాధ్యము కాదు. అటువంటి నీ సన్నిధి యందు నిలిచియు మోక్షలక్ష్మిని పొందలేక సంసారలంపటాలలో తగులు కొని రాజుల నాశ్రయించుటకు పరుగులుపెడుతున్నాను. ఇటువంటి నన్నుపైరీతిగా అను గ్రహింపజేయుము పరమేశ్వరా! పాహి పాహి.

3. అంతామిథ్యయని తలంచిచూచిన నరుండట్లౌ టెరింగిన్ సదా
కాంతాపుత్రులు నర్థముల్ తనువునిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతింజెంది చరించుగాని, పరమార్థంబైన నీయందు దా
చింతాకంతయు చింతనిల్పడుకదా శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశ్వరా! 'జగత్ మిధ్య బ్రహ్మసత్యం' అన్న నిజం తెలియక సంసారమనే సాగరంలో పడి ఎంతసేపూ బార్యాబిడ్డలు, ధనదాన్యాలు, శరీరపోషణ వీటి చుట్టే తిరుగుతున్నాము. ఈ మోహసముద్రం లోంచి, ఈ మాయా జగత్తునుంచి బయటపడే మార్గమైన నీ నామ మహత్తును కొంచెమైనా తలచుకోము.

4. నీనాయం దొడబాటుమాట వినుమా, నీచేత జీతంబునే
గానింబట్టక, సంతతంబు మదివేడ్కన్గొల్తు, సంతస్సప
త్నా నీకంబున కొప్పగింపకుము నన్నాపాటియేచాలు, తే
జీనొల్లంగరినొల్ల నొల్లసిరులన్ శ్రీకాళహస్తీశ్వరా.

శ్రీ కాళ హస్తీశ్వరా! మనము ఒక ఒప్పందము చేసికొందాము. అది ఏమిటంటే నేను నీ సన్నిధిన చేసిన సేవకు నాకు సిరులు, సంపదలు ఏమీ వద్దు. మోక్షమును మాత్రము ఇచ్చి, నన్ను నా భార్య బిడ్డల నే, ఈ మోహ పాశముల నుండి విడిపింపుము. ఏమీకోరనంటూనే మనుష్యులకు కష్టసాధ్యమైనదే కోరాడు ఈ కవీశ్వరుడు దేవుని తోనే బేరము లాడగల దిట్టయని విదితమౌతోంది. అది ఆయన ధూర్జటి (శివుడు) కావటము వలనే చెల్లినది.

5. భవకేళీమది రామదంబున మహాపాపాత్ముడై వీడు న
న్ను వివేకింప డటంచు, నేను నరకార్ణోరాశిపాలైన బ
ట్టవు, బాలుండొకచోట నాటతమితోడ న్నూతగూలంగ దం

డ్రి విచారింపకయుండునా కటకటా శ్రీకాళహస్తీశ్వరా.

శ్రీ కాళ హస్తీశ్వరా! నేను ఎన్ని పాపములు చేసినా రక్షింప వలసిన బాధ్యత నీదే కదా! తండ్రి కొడుకు పొరపాటున బావిలో పడితే చూస్తూ ఊరుకుంటాడా. అలానే నేను జననమరణాల మాయలో పడి చెడు మార్గమున నడుచు చుంటే తోవ తప్పించి సన్మార్గమునకు తిప్పి నా పాపములను పోగొట్టి భక్తి మార్గమున నిలుప వలసిన వాడివి నీవే కదా! నేను భక్తి మార్గము తప్పినడచిన అది నీ బాధ్యతే కదా! నీవే నన్ను నరకకూపంలో పడకుండా సన్మార్గమునకు తిప్పవలెనను.

6. స్వామిద్రోహముచేసి, వేరొకని కొల్వన్‌బోతినో, కాకనే
నీమాట ల్వినవొల్ల కుండితినో, నిన్నే దిక్కుగా జూడనో?
యేమీ యిట్టి వృథాపరాధినగు నన్నున్ దుఃఖవారాశి వీ
చీ మధ్యంబున ముంచి యుంపదగునా? శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! 'నీవే తప్ప నితః పరం బెరుగ నన్న' నన్ను నీవు రక్షింపకున్న ఇక రక్షించుదైవ మెవ్వడు? నిన్నే నమ్ముకుని, నీ నామ జపమే చేయుచు, నే పాద సేవకుడ నైన నన్ను నిరపరాధిని దుఃఖ సముద్రములో పడవైచుట నీకు తగునా? లేక ఇది కూడా నీ కరుణయేనా? నా కర్మ పరిపక్వమైనపుడు నన్నుద్ధరించు వాడవుకూడ నీవే కదా! ఓ కరుణా సముద్రా పాహి! పాహి!

7. దివిజక్ష్మారుహ ధేను రత్నఘనభూతిన్ ప్రస్ఫురద్రత్నసా
నువు నీవిల్లు, నీధీశ్వరుండుసఖు, డర్ణోరాశి కన్యావిభుం
డు విశేషార్చకుడింక నీ కెనఘనుండున్ గల్గునే? నీవు చూసి
విచారింపవు లేమి యెవ్వడుడుపున్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నీ సంపద, నీ స్నేహితులు చాల గొప్పవారు అటువంటి నీకు సాటి మరెవరూ లేరు కల్ప వృక్షము, కామధేనువు, చింతామణి అనువంటి రత్నములతో పొదగబడిన మేరుపర్వతమే నీ హస్తభూషణమైన ధనుస్సు. ధనాధిపతియైన కుబేరుడు నీకు మిత్రుడు. లక్ష్మీపతి (విష్ణువు)నిన్ను పూజిం

చుచెలికాడు. ఇట్టి వారు నీకున్ననూ నీవు నా బోటి దరిద్రులను రక్షించు దయానిధివి. నీసాటిదైవము ఇల లోకలడా?

8. నీతో యుద్ధము చేయనోప, గవితానిర్మాణ శక్తిన్నినున్
బ్రీతుం చేయగలేను, నీ కొరకు తండ్రిన్ చంపగాజాలనా
చేతన్ రోకట నిన్ను మొత్త వెఱతున్; జీకాకు నా భక్తి యే
రీతి న్నాకిక నిన్ను చూడగనగున్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ఈశ్వరా! నా అనన్య భక్తియే నన్ను చీకాకు పెట్టుచున్నది. నిన్ను చూచుటకు నీతో అర్జునినిలా యుద్ధము చేయలేను. నాకవిత్వముచే నిన్ను ఆనందింప జేయలేను. నీకోసం నాతండ్రిని చంపలేను. రోకలిచే నిన్ను మోదగలేను ఇట్లు ఏమీ చేయలేని నన్ను, నాభక్తివలననే నీ దగ్గరకు చేర్చుకొమ్ము.

9. ఆలున్ బిడ్డలు తల్లిదండ్రులు ధనంబంచు న్మహాబంధనం
బేలా నామెడ గట్టినాడవిక నిన్నే వేళం(జింతింతు, ని
ర్మూలంబైన మనంబులో నెగడు దుర్మోహాబ్ధిలో గ్రుంకి యీ
శీలామాలపు జింతనెట్లుడిపెదో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! ఆలు, బిడ్డలు, తల్లి, దండ్రి అని యెడి మోహ పాశములతో కట్టుబడిన నేను, నీ నామ స్మరణను కూడా విస్మరించితిని,కాబట్టి ఈ బంధాలను కలిగించిన నీవే నన్ను వీటినుంచి విడగొట్టాలి. అట్టి మోహపాశములను పొగొట్టి, నీ నామస్మరణామృత మును నాకందజేయుము విషకంధరా! ఈశా!

10. నిప్పై పాతక దూలశైలమడచున్ నీ నామము న్మానవుల్
దావున్ దవ్వుల విన్న సంతక భుజాదర్పోద్ధత క్లేశముల్
తప్పం దీరును ముక్తులౌదురని శాస్త్రంబు ల్మహాపండితుల్
చెప్పంగా దమ కింక శంకలుండవలెనా? శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! నీ నామశ్రవణ భాగ్యము కల్గినంతనే (దూరము నుండి అయినా, దగ్గర నుండి అయినా) పాపములనే దూదికొండలు అగ్నివలే నశింపబడును, యమ పాశము నుండియు, నరకబాధల నుండి కూడ విముక్తి కల్గునను విజ్ఞుల మాట నిశ్చయమైనపుడు, మా పాపములు నశించిపోవుట అబ్బుర మా! నీ నామస్మరణే మాధ్యేయ మైనపుడు నీ పద సన్నిధి మాకు కరువగునా!

11. వీడెంబబ్బినయప్పుడున్ దమస్తుతుల్ విన్నప్పుడుంబొట్టలో
కూడున్నప్పడు శ్రీ విలాసములుపైకొన్నప్పుడున్ గాయకుల్
పాడంగా వినునప్పుడున్ జెలగుదంభప్రాయుని శ్రాణనన్
క్రీడాసక్తులనేమి చెప్పవలెనో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! కడుపు నిండా భోజనంచేసి తాంబూలం వేసుకున్నప్పుడు, నీ పాటలు విన్నప్పుడు, కవులు సభలో కొలువుతీరినపుడు, గాయకులు గొంతెత్తి శ్రావ్యంగా పాడినపుడు, సుఖసౌఖ్యా లలో మునిగి తేలుతున్నప్పుడు, క్షణికమైన యవ్వన సంపదను చూసుకుని మురిసిపోతున్నప్పుడు ఇలా నీ నామస్మరణ మరచిన ధీనులను పతితులను గూర్చి ఏమనిచెప్పగలము?

12. నిను సేవింపగ నాపదల్పొడమనీ, నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుండననీ, మహాత్ముడననీ, సంసారమోహంబు పై
కొననీ, జ్ఞానముగల్గనీ, గ్రహగతుల్ కుందింపనీ, మేలు వ
చ్చినరానీ, యవినాకుభూషణములే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! భక్తవత్సలా! నీ సంసేవా భాగ్యముచే నాకు కష్ట నష్టములు కల్గినా, నన్ను జనులు సామాన్య మానవునిగా భావించినా, మహాత్ముడని పొగిడి సన్మానాలు చేసినా మోహపాశంలో ఇరుక్కున్నా, సుఖబోగాలుపొందినా మోక్షజ్ఞానం పొందినా, కుంగిపోను పొంగిపోను. నీ పదములను విడువను. వీటిని ఆభరణములుగా భావిస్తాను. నన్ను రక్షించువాడవు నీవే కదా భక్తవరేణ్యా.

13. ఏ వేదంబు పఠించెలూత? భుజగంబే శాస్త్రముల్చూచె, దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁగరి, చెంచేమంత్ర మూహించె, బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా? కావు! మీ పాదసం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! జ్ఞానమనునది నీ పాద సేవాను రక్తి చే కల్గును గాని చదువుల వలన కాదు మంత్ర , తంత్రములు, వేదవిజ్ఞానము ఫలము నీయజాలవు, నీ పాదసేవానురక్తి వలెననే సాలెపురుగు, ఏనుగు, పాము, బోయవాడు మోక్షమందగల్గిరి. అట్టి సేవా భాగ్యమును నాకు కూడ అనుగ్రహింపుము.

14. కాయల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు, వక్షోజముల్
రాయన్రాపడె ఱొమ్ము, మన్మధ విహారక్లేశ విభ్రాంతిచే
ప్రాయంబాయెను, బట్టగట్టెతల, చెప్పన్ రోతసంసరామేఁ
జేయంజాల, విరక్తు చేయగదవే శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! స్త్రీల గోళ్ళవల్ల నాశరీరం కాయలు కాసింది. వారి రొమ్ముతాకిడికి నా రొమ్ము గట్టిపడింది. కామప్రవృత్తిచేత నావయస్సుడిగి పోయి, బట్టతల ఏర్పడి, అసహ్యంగా తయారయ్యాను. స్వామీ! సరాగి (సంసార సుఖముల మునిగి) యైన నన్ను విరాగి నొనర్చవలసిన భారము నీదే నయ్యా పరమేశ్వరా! ఎప్పుడయా స్వామీ నాకీ బంధ మోచనము!

15. నిన్నే రూపముగా భజింతుమదిలో, నీరూపు మోకాలో? స్త్రీ
చన్నో?కుంచమొ? మేక పెంటికయొ? యీ సందేహముల్మాన్పి, నా
కన్ను లన్టవటీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే
చిన్నీ రేజ విహారమత్త మధుపా! శ్రీకాళహస్తీశ్వరా!

నా మానస పద్మమున విహరించు తుమ్మెద వంటి స్వామీ! ఏదయా!నీరూపు ఎలాగున్నా వయ్యా! ఏ తీరున నిను కనుగొనను? నీ రూపము మోకాలా? స్త్రీ చనుబాలా? మేకపెంటికనా? ఏది నీరూపని

భావించను ఎక్కడ జూచిన నీవుందు వందురే! 'ఎందెందు వెదకి చూచినా అందందే కలడ'ందురే! నీరూపు చూపి కటాక్షించవయ్యా! ఈశ్వరా! పాహి! పాహి!

16. నిను నా వాకిలి గావుమంటినొ? మరున్నీ లాలకభ్రాంతి గుం
టెనపొమ్మంటినొ? యెంగిలిచ్చితిను తింటేగాని కాదంటినో?
నిను నెమ్మిం దగ విశ్వసించు సుజనానీకంబు రక్షింప చే
సిన నావిన్నపమేలగై కొనవయా? శ్రీకాళహస్తీశ్వరా!

ఓ స్వామీ! ఈశ్వరా! కరుణా పరాయణా! నిండైన మనసుతో నిన్ను కొలుచు వారిని నీవు రక్షింతు వన్న మాట నిజమే యైన నా మొర ఎందుకు ఆలింపవయా తండ్రీ! నేనే మైనా బాణాసురుని మాదిరిగా నిన్ను నావాకిట కాపలా యుండమన్నానా? దేవ తాస్త్రీలవద్దకు రాయబారిగా పొమ్మన్నానా? తిన్నడిలాగా ఎంగిలి తినమని నిష్టూరాలాడానా? ఎందుకయా స్వామీ పలకలేకున్నావు?

17. ఆలన్ ఉవ్వగ చేతులాడవు, కుమారా, రమ్ముర మ్మంచు నే
చాలన్ చంపగ, నేత్రము ల్దివియగా శక్తుండ నే గాను, నా
శీలంబేమని చెప్పనున్న దిక నీ చిత్తంబు, నా భాగ్యమో
శ్రీ లక్ష్మీసపతి సేవితాంఘ్రియుగళా! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీమన్నారాయణుని చే పూజింపబడిన పాదములుకల ఈశ్వరా! స్వామీ! నా నడవడి నీకు నచ్చిన యెడల నన్ను నీ చెంత చేర్చుకొనుము. నేను విజ్ఞుడనేబోయవానివలె రాళ్ళనే పూలుగా జేసి నిను పూజింప లేను. చిరు తొండ నంబి వలె, నా కుమారుని నీకు అర్పింపలేను.బోయఅయిన తిన్నడి మాదిరిగా నా కనులు పీకి నీకు ఇవ్వలేను. అయినా నామనసారా నీ పూజిలను చేయగలను. నీకు ప్రియమయిన నన్ను దరిజేర్చుకొమ్ము.

18. రాజుల్మత్తులు, వారి సేవ నరకప్రాయంబు, వారిచ్చు సం
భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మవ్యధా
బీజంబుల్, తదపేక్ష చాలు, పరితృప్తింబొందితిన్, జ్ఞానల

క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము, దయతో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నే నింత కాలము నిన్ను మరచి గర్వితులయిన రాజుల కొలువు చేసి వారికి నరక ప్రాయ మయిన సేవ చేసి, చేసి, స్త్రీలు, పల్లకీలు, గుర్రములు, ఆభరణములు మొదలైన వారి బహుమానములంది, అలసి, సొలసితిని, విషయభోగముల వాంఛ దూరమయినది. ఇకనైననాకు నీ పాదసేవానురక్తిని, మోక్షలక్ష్మినిదయతో ప్రసాదింప వయ్యాస్వామీ!

19. నీ రూపంబు దలంపగా తుదమొద ల్నేగాన నీవైనచో
రారారమ్మనియంచు చెప్పవు, వృథారంభంబు లింకేటికిన్
నీరన్ముంపుము పాలముంపు మిక నిన్నే నమ్మినాడం జుమీ
శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీకాళహస్తీశ్వరా!

తుది, మొదలు లేని నీరూపు భావింప నశక్తుడనయ్యాను. నీవైనా నామీద ప్రేమతో 'రారా'అని పిలిచి చెప్పటంలేదు. నన్ను, నీట ముంచినా, పాలముంచినా నీవే గతి యని నమ్మిన నన్ను ఏరీతిగ ఏలు కొందువో! నీదే దయ స్వామీ! శ్రీరామపూజిత చరణా!

20. నీకున్, మాంసము వాంఛయేని కరవా? నీచేత లేడుండగా
జోకైనట్టిగా కుఠారముండ ననలజ్యోతుండ నీరుండగా
పాకరంబొప్ప ఘటించి చేతిపునుకన్ భక్షింప కాబోయచే
చేకొంటెంగిలిమాంస మిట్లు తగునా శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నీకు మాంసము తినాలన్న కోరిక ఉంటే, నీ దగ్గర ఉన్న లేడిని నీ గొడ్డలిచే చంపి, నేత్రాగ్ని తో కాల్చి, నీ నెత్తిమీది గంగచే పచన మొనర్చి, నీ చేత యున్న పుఱ్ఱెఅను పాత్రలో తినవ చ్చుకదా! ఎంగిలి కూడెందుకయా స్వామీ! నీ వంటి గొప్పవాని కిది తగునా!

21. రాజైదుష్కృతి చెందె చందురుడు, రారాజై కుబేరుండు దృ

గ్రాజీవంబున గాంచె దుఃఖము, కురుక్ష్మాపాలు డామాటచే
యాజింగూలె సమస్త బంధువులతో, నారాజ శబ్దంబు ఛీ,
ఛీ! జన్మాంతరమందునొల్లనుజుమీ! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! 'రాజు' అన్న పదము విన్న వెంటనే అసహ్యమగునట్లు చంద్రుడు, కుబేరుగు, దుర్యోధనుడు కళంకములు కలవారయ్యారు. రాజు అన్నపేరుగల చంద్రుడు మచ్చగల వాడయ్యాడు. రారాజు అన్న పేరు గల కుబేరుడు. మెల్లకన్న కలవాడై అవస్థపడ్డాదు. రారాజు గా పేరు పొందిన దుర్యోధ నుడు తన పక్షం వహించిన రాజులతో ధర్మక్షేత్రంలో మరణించాడు. అటువంటి రాజు పదము 'ఛీఛీ' అంటాను కానీ వచ్చే జన్మలో కూడా కోరుకోను.

22. రాజర్థాతురుడైనచో నెచట ధర్మంబుండు? నేరీతి నా
నాజాతిక్రియ లేర్పడున్? సుఖము మాన్యశ్రేణికెట్లబ్బు రూ
పాజీవాళికి నేదిదిక్కు? ధృతి నీ భక్తుల్ భవత్పాద నీ
రేజంబుల్ భజియింతు రేతెరగునన్? శ్రీకాళహస్తీశ్వరా!

ఓ రాజ పరమేశ్వరా! రాజే ధర్మము తప్పి చరించినపుడు ప్రజలు అట్లు కాకుండటెట్లు? 'యధా రాజా, తధాప్రజా' కదా! రాజులు ధర్మము పాటించనిచో ఆయా జాతుల వారు వారి వర్ణాశ్రమ ధర్మాలను ఎట్లా పాటిస్తారు? వేశ్యలకు రక్షణ ఏది? నీ భక్తులు నిన్ను చేరుటకు కూడ సందే హింతురు కదా!

23. తరగల్ పిప్పలపత్రముల్ మెఱుగుటద్దంబుల్ మరుద్దీపముల్
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతజటప్రభల్
సురవీథీలిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్
సిరులందేల మదాంధలౌదురుజనుల్? శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ప్రాణేశ్వరా! ప్రాణములు నీటికెరటాల వంటివి, రావి ఆకులు వంటివి, మెరిసే అద్దాలలాంటి వి, ఎడారిలోని ఎండమావులలాంటివి, ఏనుగుచెవుల వంటివి, వెన్నెల అనే నీటి బిందువులాంటివి. ఇవి

అన్నీ అందమైనవే కావచ్చు కాని అశాశ్వతమైనవి.ప్రాణులు తమ ప్రాణములు అశాశ్వతమని తెలుసుకోలేక అంధులవలె తిరుగాడు చున్నారు. రక్షింప నీవుకలవు కదా!

24. నిన్ను న్నమ్మినరీతి నమ్మనొరులన్, నీకన్ననా కెన్న లే
రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండు నా
యన్నా! యెన్నడునన్ను సంసృతివిషాదంభోధిదాటించియ
ఛ్ఛిన్నానంద సుఖాబ్ధిఁదేల్చెదొ కదే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ స్వామి ! నీవే దిక్కు, నీవే తల్లివి, తండ్రివి, సఖుడవు, గురుడవు, దైవంబు. నిన్నే నమ్మి యున్న నన్ను ఈ దుఃఖ సాగరమునుండి కడ తేర్చు. ఎడతెగని ఆనందానిచ్చే సుఖములనే మోక్షసాగరమున తేల్చే భారము నీదే నయ్యా దేవ దేవా!

25. నీ పంచం బడియుండగా కలిగిన న్భిక్షాన్నమేచాలు, ని
క్షేపం బబ్బిన రాజకీయముల నే సేవింపగా నోప, నా
శా పాశంబుల జుట్టి త్రిప్పకుము సంసారార్థమై, బంటుగా
చేపట్టం దయగల్గెనేని మదిలో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ దీన బాంధవా! స్వామీ నీవు కరుణా సాగరుడవుకదా! నన్నెందుకయా ఈ రాజుల చుట్టూ తిరుగునట్లు చేయుచున్నావు. నీ సన్నిధి యందు లభించు బిక్షాన్నమే నాకు చాలు దేవ దేవా! రక్షించి నన్ను నీ సన్నిధి యందే నిల్పుకొమ్ము స్వామీ! నిధులు లభించినా సరే నేను నీచమైన పురుగుల లాంటి రాజులను ఇంక సేవించను.

26. నీ పేరున్, భవదంఘ్రి తీర్థము భవన్నిష్ఠ్యూత తాంబూలమున్
నీ పళ్ళెంబు ప్రసాదమున్గొని కదా నే బిడ్డనైనాడ న
న్నీ పాటిం గరుణింపు మోప నిక నే నెవ్వారికిం బిడ్డగాన్
చేపట్టందగు పట్టి మానఁదగదో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ తండ్రి! ఈశ్వరా! నీ సన్నిధి యందు పసిబిడ్డనయ్యాను. నీ నామము స్మరిస్తూ, నీ పాద తీర్థము గ్రోలి, నీవుతినగా మిగిలిన ప్రసాదముతిని నీకు పిల్లవాడి నయ్యాను.  నీవే వదిలివైచిన రక్షించు వారెవరు! మనవి తండ్రీ బిడ్డల బాంధవ్యము సుమా! నన్ను కాచుభారము నీదే.

27. అమ్మా యయ్యయటంచు నెవ్వరిని నేనన్న న్శివా! నిన్ను నే
సుమ్మీ! నీ మది తల్లిదండ్రులటంచు న్బూడగాబోకు నా
కిమ్మై తల్లియు తండ్రియున్ గురుడు నీవేకాక సంసారపుం
చిమ్మం జీకటి గప్పకుండగసుమా! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీకాళహస్తీశ్వరా! నేను అమ్మా అని ఎవరిని పిలిచినా అది నిన్నే పిలిచినట్లే!నాకు జన్మనిచ్చిన తల్లి దండ్రులు వేరే వున్నారని ఆలోచించకు. ఈ జన్మకు నాకు తల్లి, తండ్రి, గురువు, దైవము అన్నీ నువ్వే. కాబట్టి ఈ సంసారమనెడి చీకటి నుండి నన్నుద్ధరింప వలసిన భారమునీదే.

28. కొడుకుల్ పుట్టరటంచునేడ్తు, రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్, వారిచే నేగతుల్
వడ సెం? పుత్రుడు లేని యా శుకునకున్ వాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రునకున్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! కొడుకులు లేకపోతే పున్నామ నరకము తప్పదన్న భావంతో కొడుకులు కావాలని చాలమంది ఏడ్చుచున్నారు తప్ప సద్గతికి నీ భజన చాలునని తెలుసుకోటంలేదు. కౌరవరాజుకి నూరుగురు కొడుకులున్నారు.ఆయనకి ఏ ఉత్తమలోకాలు లభించాయి వారివల్ల? శుకమహర్షికి కుమారులు లేరు. ఆయనకేం తక్కువైంది? శుకుని నీ సన్నిధి చేర్చుకొన్నట్లే నన్నుకూడ చేర్చుకొమ్ము.

29. గ్రహదోషంబు దుర్నిమిత్తములు నీ కళ్యాణనామంబు ప్ర
త్యహమున్ బేర్కొనునుత్తమోత్తముల బాధంబెట్టగానోవునే
దహనుంగప్పగజాలునే శలభసంతానంబు? నీ సేవచే
సి హతక్లేశులుగాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా!మిడతల గుంపు ఎలాగైతే అగ్నిని కప్పలేవో, అలాగే ఎల్లప్పుడూ నీ నామజపం చేసే మహాత్ములను గ్రహదోషాలు, చెడుశకునాలు బాధించలేవు. ఇంత చిన్న విషయం తెలిసికూడా మనుష్యులు ఎందుకయ్యా నిన్ను సేవించి కష్టాలను తొలగించుకోలేకుండా ఉన్నారు.

30. అడుగంబోనిక నన్యమార్గరతులం బ్రాణావనోత్సాహినై
యడుగంబోయినబోదు నీదుపదపద్మారాధక శ్రేణియు
న్నెడకున్ నిన్ను భజింపగా గనియు నాకేలా పరాపేక్ష? కో
రెడిదింకేమి? భవత్ప్రసాదమె తగున్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీకాళహస్తీరా! వేరే దేవతలను పార్థించే వారి దగ్గరకివెళ్ళి నాప్రాణాలను కాపాడమని నేను కోరను. ఒకవేళ అలా కోరాల్సి వస్తే, నీ పాదపద్మములను సేవించే భక్తులను మాత్రమే అడుగుతాను.ఈ నిర్ణయం తీసుకున్నతర్వాత నాకు కోర్కెలు లేవు. అలా కోర్కెలు లేకుండ నన్ను కడతేర్చు భారము నీదే కదా!

31. మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యముల్పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలము ల్పరిమళంబు ల్మోక్షమీజాలునే
మదిలో వీని న పేక్ష చేసి నృపధామద్వారా దేశంబు గాం
చి దినంబుల్ వృథపుత్తరజ్ఞు లకటా శ్రీకాళహస్తీశ్వరా!

ఓ రాజ పరమేశ్వరా! విషయ సుఖలోలుర మయిన మేము ఎంతసేపూ రాజుల నాశ్రయించు చున్నాము. ఏనుగులు, పల్లకీలు, గుర్రములు , మాణిక్యములు, స్త్రీలు, వస్త్రములు, పరిమళద్రవ్యములు కోరుతూ! రాజ పరమేశ్వరుడివైన నిన్నాశ్రయించలేకున్నాము. ఎందుకయ్యా మాకీ బుద్ధి మాంద్యత.

32. రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్,
పాసీపాయదు పుత్రమిత ధన సంపద్భ్రాంతి, వాంఛాలతల్
కోసీకోయదు నామనం బకట! నీకున్ ప్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు, దీనితుల్ణచవే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ స్వామీ! చంచలమైన బుద్ధిని మాకెందుకిచ్చా వయా! నీ మీద క్షణకాలము నిలచిన బుద్ధి మరల, మరల సుఖ భోగముల మీదకు మరలుచున్నది. స్త్రీల యవ్వనసుఖముల పట్ల, పుత్రులు, స్నేహితులు, ధనములపట్ల భ్రాంతి తొలగినట్లే, తొలగి, మళ్ళీ కలుగుతోంది. కోర్కెలనే తీగలను కోసినా మళ్ళీ పుట్టుకొస్తున్నాయి.అట్లు మరలకుండ నిశ్చల బుద్ధిని అనుగ్రహించుట నీ ధర్మమే కదా!

33. ఎన్నేళ్ళుండుదు? నేమిగందు? నిక నేనెవ్వారి రక్షించెదన్?
నిన్నే నిష్ఠభజించెద న్నిరుపమోన్ని ద్రాప్రమోదంబు నా
కెన్నండబ్బెడు నెంతకాలమున నేనిట్లున్న నన్నియ్యెడం?
చిన్నంబుచ్చక నన్ను నేలుకొనవే! శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమ మహేశ్వరా! బ్రహ్మానంద మయిన స్థితిని నాకెపుడనుగ్రహింతువు? నే నెన్ని నాళ్ళు ఈ బ్రతుకు బండి నీడ్వవలయును తండ్రీ ఇలాఉండి నేనెవరిని రక్షింపగలను? ఏమి చేయలేని స్థితిలో ఉన్నాను.కావుమయాదయానిధీ!

34. చావంగాలము చేరువౌ టెరిగియుం చాలింపగా లేక, త
న్నేవైద్యుండు చికిత్సబ్రోవగలడో, యేమందు రక్షించునో,
ఏవేల్పుల్ కృపజూతురోయనుచు, నిన్నింతైన చింతింప దా
జీవశ్రాద్ధము చేసికొన్నయతియున్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! మరణమాసన్నమైన రోగియేకాదు, తన పిండము తనే పెట్టుకున్న యోగి కూడ నన్నే వైద్యుడు బ్రతికించును, ఏమందు రక్షింపును. ఏ దైవము రక్షించునో అని చూచునే కాని నీ పద ధ్యానము చేయలేకున్నాడేమి తండ్రీ! నామనసు నీ పదధ్యానమందే నిలుపుము పరమేశ్వరా!

35. దినముం జిత్తములో సువర్ణముఖరీతీరప్రదే శామ్రకా
నన, మధ్యోపలవేది కాగ్రమున నానందంబునం పంకజా
సన నిష్ఠ న్నిను జూడగన్న నదివోసౌఖ్యంబు లక్ష్మీ విలా
సిని మాయనటనల్ సుఖంబులగునే శ్రీకాళహస్తీశ్వరా!

యోగి పరమేశ్వరా! సువర్ణముఖీ నదీ ఒడ్డున నున్న మామిడితోట మధ్యలో, రాతి వేదికపైన, నీ యోగముద్రను నన్ను మనుసునందు నిల్చుకొననీ! సంపదల యందు వ్యామోహము నశింపనీ. లక్ష్మీ దేవి మాయలో పడకుండా ఉండనీ!

36. ఆలంబు న్మెడగట్టి, దానికి నపత్యశ్రేణి కల్పించి, త
ద్బాలవ్రాతమునిచ్చి పుచ్చుకొను సంబంధంబుగావించి, యా
మాలార్కంబున బాంధవంబనెడి ప్రేమంగొందరం ద్రిప్పగా,
సీలన్సీలనమర్చిన ట్లొసగితో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ స్వామీ! ఏమిటయా నీలీల, సంసారము, పిల్లలు, బంధువులు అను పట్టుతాళ్ళు నామెడ చుట్టూ చుట్టి, నా మనసును కోతిని చేసి తాడించు చున్నావు. శీలపై శీలతిరుగు నట్లు చేసి ఈ సంసార మనే పాశంలో పడేశావు. నీ సంసేవా భాగ్యము నాకెపుడు కల్గునయా?

37. తను వేనిత్యముగానొనర్పు మదిలేదా, చచ్చి, జన్మింపకుం
డ నుపాయంబుఘటింపు, మాగతులరెంటన్నేర్పులేకున్న లే
ద ని నాకిప్పడె చెప్ప చేయగలకార్యంబున్న సంసేవ జే
సి నినుగాంచెదగాక కాలముననో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశ్వరా! నీ ధ్యాన మున్న ఈ జన్మ నయిన నాకు శాశ్వతము చేయి లేదా మరు జన్మ లేకుండ నీ పదసన్నిధి ప్రసాదించు ఈ రెండు పనులు నీకు చేతకాకపోతే, లేదా మరే వుపాయ మున్న నీ పదసన్నిధి చేరటానికి చెప్పు. ఆ పద్దతిలోనే నిన్ను సేవచేసి నిన్ను చేరతాను అని భగవంతుని తోనే బేరసార ము లాడు చున్నాడే ధూర్జటి మహాశయుడు.

38. పదునాల్గేలె మహాయుగంబు లోకభూపాలుండు, చెల్లించెన
య్యుదయాస్తాచలసంధి నాజ్ఞ  నొక డాయుష్మంతుడై వీరి య
భ్యుదయంబెవ్వరు చెప్పగావినరో! అల్పుల్మత్తులై యేల చ
చ్చెదరో రాజులమంచు నక్కటకటా! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీకాళహస్తీశ్వరా! పూర్మము ఒక మహారాజు పద్నాలుగు యుగాల పాటు భూమిని పాలించాడు. ఇంకొక రాజు ఉదయాద్రినుంచి అస్తాద్రి వరుకు ఏకఛత్రాది పత్యంగా ఏలాడు. మహోత్తములయిన రాజుల పేరు వినలేక తామే రాజులంచు హీనులు విర్రవీగుచున్నారు. వారి మదమణచుము దేవా!

39. రాజన్నంతనెబోవునా కృపయు, ధర్మం, బాభిజాత్యంబు, వి
ద్యాజాతక్షమ, సత్యభాషణము, విద్వన్మిత్రసంరక్షయున్,
సాజన్యంబు, కృతంబెరుంగుటయు, విశ్వాసంబుగాకున్న దు
ర్బీజశ్రేష్ఠులుగా గతంబు కలదే శ్రీకాళహస్తీశ్వరా!

అధికారము కల్గినంతనే అదివరకు వున్న మంచి గుణములు పోయి 'రాజ' పదమునే అవహేళన చేయు దుర్మార్గులని ఎందుకయా నాయకులను చేసి దేశమును భ్రష్టపట్టించు తున్నావు. అంతవరకు ఉన్నదయ, ధర్మము, స్వాభిమానము, విద్యఒసగిన ఓర్పు, సత్యవాక్కు, రక్షించు నేర్పు, సుహృద్భావము వంటి వేవి కనబడవే?

40. మునునీచే నవవర్గ రాజపదవీ మూర్ధాభిషేకంబు గాం
చిన పుణ్యాత్ములు నేను నొక్కసరివో, చింతించి చూడంగ, నె
ట్లనినం కీట, ఫణీంద్ర, పోత, మడవేదండో గ్రహింసావిచా
రిణిగాగాఁనిను గానగాక మదిలో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశ్వరా! నీచే మోక్షపదవి నందిన పుణ్యాత్ములను నన్నును సమవర్తియగు నీవుసమముగా చూడవలెను. ఏ విధముగా సమానము అంటే ఆ భక్తులైన సాలెపురుగు, సర్పము, ఏనుగు, కిరాతకుడైన తిన్నడు నిన్ను మనస్సులో చూశారు. నేను చూడలేకపోయాను. ఆ ఒక్క తేడా తప్పితే వారు, నేను సమానమే సుమా!

41. పవమానాశన భూషణప్రకరము, ల్భద్రేభచర్మంబు, నా
టకవిత్వంబు ప్రియంబులై, భుజగశుండాలాటవీచారులన్
భవదుఃఖంబులబాపు, టొప్పగొలదింబాటించి కైవల్య మి

ఛ్ఛివినోదించుట కేమి కారణమయా శ్రీకాళహస్తీశ్వరా!

నీకు ఆభరణములయిన పాములకు, చర్మాంబర ధారివైననీకు, గజములకు, ఆటవిక ప్రవృత్తి ప్రియమయి, వారికి మోక్షమునిచ్చావు. వారి దుఃఖములు పోగొట్టుట తక్కువని భావించి ఏకంగా మోక్షమే ఇచ్చావు. అట్లే నన్ను ను కాపాడుము. వారికున్న దుర్గుణములే నాకు కూడ కలవు. అటువంటి దుర్గుణ ములను నీవు మనసుకు చేరనీయవు కదా!

42. అమంస్త్రీలరమించినన్ జెడదు మోహంబింతయు బ్రహ్మ ప
ట్టము సిద్ధించిన నాశదీరదు, నిరూఢక్రోధమున్ సర్వలో
కముల న్మ్రింగినమాన, దిందుగల సౌఖ్యంబొల్ల, నీ సేవ చే
సి మహాపాతక వార్ధిరాశి గడతున్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ స్వామీ! దేవతాస్త్రీలను అనుభవించినా వ్యామోహము కొంచెము కూడా నశించదు. సాక్షాత్తు బ్రహ్మపదవి లభించినా ఆశచావదు. లోకాలన్నీ మింగినా కోపం పోదు. కాబట్టివీటి వల్ల కలిగేసుఖాలు నాకు వద్దు! మదన దహనుడి వయిన నీవు, నాలోని కామ, క్రోధ, మోహములను దహించి, నా పాప సముద్రమును ఈదునట్లు చేయుము.

43. చనువారింగని యేడ్చువారు జముడా! సత్వంబుగావత్తు మే
మనుమానం బికలేదు నమ్ముమని తారా వేళ యా రేపునన్
మునుంగబోవుచు బాసచేయుటసుమీ ముమ్మాటికింజూడగా
చెనటుల్గానరు దీనిభావమిదివో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! మానవులు ఈ మాయామోహ ప్రపంచమున తిరుగాడుచు, మరణము తప్ప దనుచు, తాము మాత్రమే శాశ్వత మయినట్లు తెలివి హీనులగుచున్నారు. శ్రాద్ధ సమయములో రేవులో 'ఓ యముడా మేము కూడా వీని వెనకే వస్తాము నిజము' అంటారే గాని నిజంగానే ఒకనాడు తాము కూడా వెళ్ళాలన్న విషయము మర్చిపోతున్నారు.

44. భవదుఃఖంబు రాజకీటముల నే(బ్రార్థించినన్ బాయునే?
భవదంఘ్రిస్తుతిచేతగాక, విలసద్బాలక్షుధాక్లేశ దు
ష్ట విధుల్మానునెచూడ మేకమెడచంటం తల్లి కారుణ్య దృ
ష్టి విశేషంబుననిచ్చుచంటవలెనో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ లోకేశా, తల్లి తన బిడ్డల ఆకలి ఎరిగి తీర్చునట్లు, మా జన్మ దుఃఖమును పోగొట్టి సుఖ భోగముల నొసగు వాడవునీవే కదా! అటువంటి నిన్నువదలి నీచులైన రాజులను ఆశ్రయిస్తే ఆకలిగొన్న బాబు తల్లిపాలు వదలి మేక మెడవద్ద నున్న చన్నులు చీకినట్లు అవుతుంది.

45. పవిపుష్పంబగు, నగ్నిమంచగు, నకూపారంబు భూమీస్థలం
బవు, శత్రుండతిమిత్రుడౌ, విషముదివ్యాహారమౌనెన్నగా
నవ నీ మండలి లోపలన్ శివ శివేత్యా భాష ణోల్లాసికిన్
శివ! నీ నామము సర్వవశ్యకతమౌ, శ్రీకాళహస్తీశ్వరా!

'శివ, శివ యన రాదా! శివనామము చేదా?

భవ సాగర మీద దుర్భర వేదన లేదా?

కరుణాళుడు కాదా! ' అను విధముగా నీనామజపము మాకు అన్ని భోగములనిచ్చునుకదా శివ మహేశ్వరా! నీ నామము వజ్రాన్ని పూవులాగా మెత్తగా, అగ్నిని మంచులాగా చల్లగా, సముద్రాన్ని భూమి లాగా నివాసయోగ్యంగా, శత్రువుని మిత్రునిగా, విషాన్ని మృష్టాన్నంగా చేస్తుంది.

46. లేవో గానల కందమూల ఫలముల్, లేవో గుహ ల్తోయముల్
లేవో యేఱుల పల్లవాస్తరణముల్ లేవో, సదాయాత్మలో
లేవో నీవు విరక్తులన్మనుప, జాలింబొంది, భూపాలురన్
సేవల్సేయగుబోదు రేలొకొ జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! ప్రజలు వీతరాగువై నిను చేరుటకు బదులు విషయ సుఖలోలురై ప్రాపంచ సుఖములకై రాజులనాశ్రయించుచున్నారు. అడవిలో కందమూలాలు లేవా, నివసించుటకు గుహలు

లేవా, నదులలో చిగురుటాకుల గుంపులు లేవా, మనసులో నీవు లేవా నువ్వు రక్షింపవా అన్న ధైర్యంతో ప్రపంచం పై వైరాగ్యంతో ఉన్నవారిని నువ్వు రక్షించటంలేదా!

47. మును నేపుట్టిన పుట్టులెన్ని గలవో, మోహంబుచే నందు చే
సిన కర్మంబుల ప్రోవులెన్ని గలవో, చింతించినం గాని, యీ
జననంబే యని యున్నవాడ నిదియే చాలింపవే నిన్ను గొ
ల్చిన పుణ్యంబునకుం గృపారతుడవై శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! ఇంతకుముందు నేనెన్ని జన్మలెత్తానో, ఎన్ని పాపాలు ప్రోగేసుకునాన్ననో నాకు తెలీదు. నా మటుకు నేను ఇదే ఆఖరి జన్మ అనుకుంటున్నాను. నువ్వు కూడా నా జన్మ పరంపరలో ఇదే నా చివరి జన్మగా భావించి అయి నాకు మోక్షమొసంగుము దయాసాగరుడ వయిన ఇది నీకు పెద్దపని కాదు.

48. తను వెందాక ధరిత్రినుండు ననునందాక న్మహారోగ దీ
పన దుఃఖాదుల బొందకుండ ననుకంపాదృష్టి వీక్షించి యా
వెనుక న్నీ పద పద్మము ల్దలచుచు న్విశ్వప్రపంచంబు బా
సిన చిత్తంబున నుండచేయ గదవే శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! ఈ శరీరమున్నంత కాలము జన్మమృత్యు, జరా, భయ, దుఃఖములు నాదరి జేరకుండ కాపాడు, నీ పాదపద్మములనే నామనస్సునందు దృఢముగా నిల్చుకోనిమ్ము. నా మరణసమయ మున నన్ను నీ సన్నిధి చేర్చుకొమ్ము.

49. మల భూయిష్ట మనోజధామము సుషుమ్నాద్వారమో! యారు కుం
డలియో పాద కరాక్షి యుగ్మములు షట్చక్రంబులో! మోముదా
జలజంబో నిటలంబు చంద్రకళయో సంగంబు యోగంబొ? గా
సిలి సేవింతురు కాంతలన్ భువిజనుల్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశ్వరా! మలినములచే కూడిన స్త్రీల జన్మస్థలము సుషుమ్న నాడియా? నూగారు కుండలియా? చేతులు, కాళ్ళు, కన్నుల జంటలు ఆరుచక్రాలా? ముఖము సహస్రార పద్మమా? నుదురు చంద్ర రేఖయా? సంగమము యోగమా? స్త్రీసంగమమే యోగమనెడి భ్రాంతి నుండి నన్ను కాపాడుము.

50. జలకంబుల్ రసముల్, ప్రసూనములు వాచాబంధముల్వాద్యము
ల్కల శబ్దధ్వను, లంచితాంబర మలంకారంబు, దీప్త ల్మెరుం.
గులు, నైవేద్యము మాధురీమహిమగాఁగొల్తున్నినున్ భక్తిరం
జిల దివ్యార్చన గూర్చి, నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!

ఈశ్వరా! స్వామీ! నేను నేర్చిన నాకవితలోని నవరసాలని అభిషేక ద్రవ్యాలుగా, పదాలకూర్పుని నీ పూజా పుష్పములుగా, శబ్దాలని వాయుద్యాలుగా, అర్థాలంకారాన్ని వస్త్రముగా, గుణములను దీపములుగా గ్రహించి, నా మనస్సులో పొంగిన భక్తిభావాలనుంచి వచ్చిన కావ్యమే నా పూజగా భావించుము.

51. ఏ లీలన్నుతియింప వచ్చు నుపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషలకలభ్యంబైన నీరూపముం
చాలుంజాలు గవిత్వము న్నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరు గాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! అర్థాలంకారములగు శబ్ధ స్వరూపములకు, పలుకులకు లొంగని నీ రూపును 'పలికెద, వేరొండుపలుకగనేలా' అని పోతనలా నా కవిత చే నిన్ను వర్ణింపగ పూను కొంటిని.

52. పాలుం బువ్వయుబెట్టెదన్, గుడురావ పాపన్న, రా యన్న, లే
లే లెమ్మన్న, నరంటి పండ్లు గొనితే, లేకున్ననే నొల్లనం
టే, లాలింపరె తల్లి తండ్రుల పుడట్టే తెచ్చి, వాత్సల్య ల
క్ష్మీ లీలావచనంబులం గుడుపరా శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! పాలన్నము పెట్టానంటే వద్దు నాకు అరటిపండ్లు కావాలని మారాము చేయు చున్న పిల్లవానిని తల్లి దండ్రులు అడిగిన దిచ్చి బుజ్జగించినట్లే నా తండ్రివైన నీవు నన్ను బుజ్జగించి నాకు మోక్షలక్ష్మినిమ్ము.

53. కలలంచు న్శకునంబులంచు గ్రహయోగంబంచు సాముద్రికం
బులటంచుం దెవులంచు, దిష్టియనుచున్భూతంబులంచు న్విషా
దులటంచు న్నిమిషార్థ జీవనములందుం బ్రీతి పుట్టించి నా
సిలుగుల్ ప్రాణులకెన్ని చేసితివయా! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నశించు ప్రాణుల మయిన మాకు స్వప్నములు, శకునములు, గ్రహస్థితులు, సాముద్రికము, రోగములు, దిష్టిభూతములు, విషములు మొదలగు ఆశాపాశముల కల్పించి, వానిలోనే తిరుగాడునట్లు చేయు చున్నావేమయా!

54. తలమీదం గుసుమప్రసాద మలిక స్థానంబుపై భూతియున్
గళసీమంబున దండ నాసికతుద న్గంధ ప్రసారంబు, లో
పల నైవేద్యము జేర్చు నే మనుజు డా భక్తుండు నీకెప్పుడుం
జెలికాడై విహరించు రౌప్యగిరిపై శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నీ స్నేహితుడై కైలాసమున తిరుగాడ వలెనంటే, నీపూజా పుష్పములను శిరస్సున దాల్చుట వలనను, విభూతి ధరించుట వలనను, నీ పూజాద్రవ్యములను వాసన చూచుట వలనను, నీ నైవేద్యమును ఆరగించుటవలనను మాత్రమే సాధ్యమగును.

55. ఆలుంబిడ్డలు మిత్రులున్ హితులు నిష్టార్థంబు లీనేర్తు రే
వేళ న్వారిభజింప జాలిపడ కావిర్భూత మోదంబునన్
కాలం బెల్ల సుఖంబు నీకు, నిక భక్తశ్రేణి రక్షింప కే
శ్రీ లెవ్వారికి కూడబెట్టెదవయా? శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! స్వామీ నీవు కూడ బెట్టిన మోక్ష ధనమును నా వంటి యోగ్యున కివ్వక ఇంకె వ్వరి కిచ్చెదవు? నేను యోగ్యుడను ఎందుకో విను! భార్యా, పిల్లలు, స్నేహితులు, హితులు అంటూ వారి వెంటే పడక నీ సంసేవ యందే తిరుగాడుచు ధైన్యమనేది ఎరుగక పుట్టించిన బ్రహ్మానందమును తాగు టకు ఇచ్ఛగలవాడనైతిని అందువలననే యోగ్యుడనైతిని.

56. కలధౌతాద్రియు నస్థిమాలికయు, గోగంధర్వమున్నున్కయుం
బులితోలున్ఘసితంబు, బాపతొడవుల్పోకుండ, దోబుట్లు కై
తొలినేవారల తోడబుట్టవు గళాదుల్గల్గెమేలయ్యె నా
శలవుల్దారము చేసి కొంటెరిగియే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ఈశ్వరా! తోబుట్టువులు లేని వాడవైనందున, నీ నివాసమైన వెండికొండ, పుఱ్ఱెలు, వాహన మైన ఎద్దు, ఆభరణములయిన నాగులు చెక్కు చెదరకుండ భాగములు కాకుండా వున్నవి. అట్టి నిన్ను ఆశ్రయించిన మంచి దనుచు చంద్రకళ, గంగ మున్నగునవి పరుగు పరుగున వచ్చి చేరుచున్నవి.

57. శ్రుతులభ్యాసముచేసి, శాస్త్రగరిమల్శోధించితత్వంబులన్
మతినూహించి, శరీరమస్థిరము, బ్రహ్మంబన్న, సత్యంబు, గాం
చితిమంచున్ సభలన్ వృథావచనము ల్చెప్పంగనే కాని, ని
ర్జిత చిత్తస్థిరసౌఖ్యముల్ తెలియరో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ మదనాంతకా! చాల చదువులు వచ్చినవని, వేద శాస్త్రముల పారాయణ మొనర్చితి మని, తత్వ చింతన తమకు మెండని, ప్రగల్భాలు పలుకు పండితులు 'బ్రహ్మమొకటే, పరబ్రహ్మమొకటే' అని పాటలు పాడు చున్నను, ఇంద్రియ సుఖములను జయించి, శాశ్వత సుఖ భోగముల నిచ్చు నిన్ను తెలియలేకున్నారు.

58. అంతా సంశయమే శరీర ఘటనంబంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపర్వాన్వితమె, మేనంతా భయభ్రాంతమే
యంతానంత శరీర శోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
చింతన్నిన్నుదలంచి పొందరు నరుల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! 'యస్య స్మరణ మాత్రేణ జన్మసంసార బంధనాత్' అన్న విధంగా నీ నామస్మ రణ చేతనే జీవుడు చెడునడతమాని, జన్మ, భయ, శోకముల నుండి, సందేహాస్పద జగత్తునిండి విముక్తు డవుతున్నాడు. నీ నామ స్మరణా మృతమే మాకష్టములను పొగొట్టు కల్పవృక్షము.

59. సంతోషించితి చాలు చాలు రతిరాజద్వార సౌఖ్యంబులన్
శాంతిన్ బొందితి చాలు చాలు బహురాజద్వారా సౌఖ్యంబులన్
శాంతింబొందెద జూపు బ్రహ్మపదరాజద్వార సౌఖ్యంబు ని
శ్చింతన్ శాంతుడ నౌదు నీ కరుణచే శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నీ దయ యనెడి బ్రహ్మానంద స్థితిని నాకొసగ వలసినది ఎందుకంటే ఈ ఐహిక భోగములందు నేను పరితృప్తుడనై విరాగి నైతిని. శారీరిక సుఖాలను అనుభవించాను ఎన్నో సన్మా నాలు పొంది మానసిక ఆనందాన్ని పొందాను. ఇక చాలు నాకు.

60. అకలంకస్థితినిల్పి, నాదమను ఘంటారావమున్ బిందు దీ
ప కళాశ్రేణివివేకసాధనములొప్పన్బూనియానంద కా
రక దుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తివారించు వా
రికిగా వీడు భవోగ్రబంధలతికల్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ఈశ్వరా! ఏకాగ్రత్తతో వేటగాడు జంతువులను అనేక సాధనములతో వేటాడును. జన్మసంబం ధము లయిన బంధములు వీడవలెనన్న నిర్మల స్థితిలో ఓంకార నాదమును చేయుచూ తెలివిఅనే సాధన మును చేతపుచ్చుకుని విషయ వాంఛల యందు తిరుగాడెడు మనసను మృగమును నీ నా మామృతము చే బంధింపవలెను.

61. శుకము ల్కింశుకపుష్పముల్గని ఫలస్తోమంబటంచు న్సము
త్సుకతం చేరగబోవనచ్చట మహాదుఃఖంబు సిద్ధించు, క
ర్మ కళాభాషలకెల్ల ప్రాపులగు శాస్త్రంబు ల్విలోకించువా
రికి నిత్యత్వమనీష దూరమయిచన్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! నిత్యకర్మలకు, సకల కళలకు సాహిత్యమునకు మూలమైన శాస్త్రవిద్యలు నేర్చి నేర్చి అవేసమస్తమను అహంకారమునకు లోనై (చిలుక మోదుగపూలను ఫలములను కొనురీతిగా) శాస్త్రములకు మూలమువైన నిన్ను గుర్తింపగ లేని అజ్ఞానులకు కూడ మోక్షమునిచ్చు వాడవు నీవు కావ!

62. ఒకరింజంపి పదస్థులై బ్రతుక తామొక్కొక్కరూహింతురే
లోకొ? తామెన్నడు జావరో? తమకు బోపోసంపదల్? పుత్ర మి
త్ర కళత్రాదులతోడ నిత్యసుఖమందంగనుందురో? ఉన్నవా
రికి లేదో మృతి యెన్నడుం గటకటా! శ్రీకాళహస్తీశ్వరా!

ఓ జగదీశా! సిరి సంపదలు నిత్యమని, సత్యమని భ్రమసి, వానిని పొందుటకు చేయకూడని పనులను చేసి, వారే నిత్యమను కొను అజ్ఞానులను కూడ రక్షించు భారము నీదే సుమా!

63. నీ కారుణ్యముగల్గినట్టి నరుడే నీచాలయంబుం చొరం
డే కార్పణ్యపుమాటలాడ నరుగం డెవ్వారితో, వేషముల్
గైకోడే మతముల్భజింప డిల నే కష్టప్రకారంబులన్
చీకాకై చెడిపోడు, జీవనదశన్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! దయాసింధువైన నీ దయను పొందిన వాడు ఏ రాజులను ఏ మతములను ఆశ్రయించడు. తనకొరకు జాలికొలుపు పలుకులు పలకడు. అనన్యమయిన నీ సేవయందే ఆనందమును పొందుతాడు.

64. జ్ఞాతుల్ద్రోహులు వాండ్రుసేయుకపటేర్ష్యాది క్రియాదోషముల్
మాతండ్రాన సహింపరాదు, ప్రతికర్మంబించుకే జేయగా
బోతేఁదోషముగాన మాని, యతినై పోగోరినన్ సర్వదా
చేతః క్రోధము మానదెట్లు నణతున్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ శంకరా! 'ఒరులేయవి యొనరించిన తనకప్రియమైన....' వానిని మరచిన వారే ధీమంతులు నాకర్మ వశమున నాకోపము మాత్రము నన్ను వదలకున్నది. దీనిని అణచుటనీకే సాధ్యము.

65. చదువుల్నేర్చిన పండితాధములు స్వేచ్ఛాభాషణక్రీడలన్
వదరన్, సంశయ భీకరాటవుల త్రోవల్దప్పి వర్తింపగా,.
మదన క్రోధ కిరాతు లందుగని, భీమ ప్రౌఢిచే దాకినం
చెదురుంచిత్తము, చిత్తము, చిత్తగింపగదవే శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! స్వామీ! కొందరు పండితాధములు ఇష్టం వచ్చినట్టు తిరుగుట, పలుకుటయే 'ఆనందో బ్రహ్మ' అని పెడత్రోవ పట్టిస్తున్నారు. నాకు స్థిర చిత్తమును అనుగ్రహించి నా మనుస్సును కామ క్రోధా దులచే చెదరనీక, చెప్పడు మాటలను విననీక రక్షింపుమయా దేవ దేవా!

66. శ్రీ శైలేశు భజింతునో, యభవు గాంచీ నాథు సేవింతునో
కాశీ వల్లభు గొల్వబోదునొ, మహిన్ కాళేశుబూజింతునో
నాశీలంబణువైన మేరువనుచున్ రక్షింపవే, నీ కృపా
శ్రీ శృంగార విలాస హాసములచే శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! శ్రీ శైలము, కంచి, కాశీ, మహాకాళము లందు మాత్రమే కాక ఎల్లెడల కొలు వైన నీవు, నీదయ యనెడి సంపదలతో, నీ మందహాసములచేతను నన్ను కాపాడవలసినది. అణుమాత్ర మైన నేను ఈ క్షేత్రము లన్నియు తిరగలేను స్వామి.

67. అయవారై చరియింపవచ్చు, తమ పాదాంభోజ తీర్థంబులన్
దయతో గొమ్మనవచ్చు, సేవకుని నర్థప్రాణదేహాదుల
న్నియు మాసొమ్మనవచ్చుగాని, సిరుల న్నిందింప, నిన్నాత్మని
ష్ఠియతన్ గానగరాదు, పండితులకున్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! గురువులన బడెడి మూర్ఖులు తమ చిత్తము లందు నిన్ను కానగ లేక శిష్యుల ధన, మనః|ప్రాణములను తమ కొసగ మని పీడించే మూర్ఖులగు చున్నారు. వారిని గూడ కాచెడి వాడవు నీవు కాదా.

68. మాయజాండ కరండకోటి బొడిగా మర్దించిరో విక్రమా
జేయుం గాయజు చంపిరో, కపటలక్ష్మీ మోహముల్ బాసిరో,
ఆయుర్దాయ భుజంగ మృత్యువు ననాయాసంబునన్ గెల్చిరో,
శ్రేయోదాయకు లౌదు రెట్టు లితరుల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! 'ఏరీ నీ సాటి వేల్పు లెందును తండ్రీ!' ఏ వేల్పులును బ్రహ్మాండంబులను పొడిగా చేయలేయలేరు. మన్మధుని జయింపలేరు సిరి సంపదల వ్యామోహములో తగుల్కొన్న వారే గాని నీ వలె విరాగులు కారు కాల సర్పమును మెడలో వేసుకొన లేరు. వీటిలో ఏ ఒక్కటి చేయలేనివారు ఇత రులకు మేలు ఎలా చేయగలరు?

69. వెనుకం జేసిన ఘోరదుర్దశలు భావింపంగ రోతయ్యెడున్
వెనుకన్ముందటవచ్చు దుర్మరణము ల్వీక్షింప భీతయ్యెడున్
ననునేజూడగ నావిధుల్బలచియు న్నాకే భయంబయ్యెడుం
చెనకుం జీకటినాయె కాలమునకును శ్రీకాళహస్తీశ్వరా!

పూర్వజన్మములలో నేను చేసిన చెడ్డ పనులు తలుచుకుంటే నాపై నాకే అసహ్యము కలుగుచు న్నది శ్రీకాళ హస్తీశ్వరా! విషయ సుఖములు, భయభ్రాంతుల నెడి జన్మదుఃఖములతో కూడిన అంధకార ములో మునిగి యున్న నాకు వెలుగు నిచ్చి కాపాడుము.

70. పరిశీలించితి మంత్రతంత్రములు చెప్పన్వింటిసాంఖ్యాది యో
గ రహస్యంబులు, వేదశాస్త్రములు వక్కాణించితిన్, శంక వో
దరయం గుమ్మడికాయలోని యవగింజంతైన, నమ్మించి, సు
స్థిర విజ్ఞానము త్రోవ చెప్పగదవే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ శంకరా! మంత్ర తంత్రములు, వేదశాస్త్రములు తీర్చలేని నా శంకలను హరించి, నాలో నమ్మక మనే దీపమును వెలిగించి విజ్ఞానమును చూపుము దేవా! దయనిధీ!

71. మొదలన్ చేసినవారి ధర్మములు నిర్మూలంబుగాచేసి, దు
ర్మదలై యిప్పటివారె ధర్మములొనర్తం, దమ్ము దైవంబు న
వ్వదె: రానున్న దురాత్ములెల్ల తమత్రోవంబోవరే ఏల చే
సెదరో మీద దలంచి చూడ రథముల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నీచులగు వారు భవిష్యత్తుని గురించి ఆలోచించక ధర్మేతర మార్గములందు నడచుచూ, అవే ధర్మములని ప్రచారము చేయు చున్నారు! ఇట్టి వారిని చూచి నీవు నవ్వవా! వారెందుకీ దుర్మార్గమున కొడిగట్టితిరో.

72. కాసంతైన సుఖంబొనర్చునో, మనఃకామంబు లీడేర్చునో
వీసంబైనను వెంటవచ్చునొ జగద్విఖ్యాతి గావించెనో
దోసంబు ల్వెడబావునో, వలసినం దోడ్తో మిముం చూపునో
ఛీ! సంసార దురాశయేలుడుపవో! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! సంసారము సుఖము కలుగచేయదు. కోర్కెలు తీర్చదు. మనలో ఏమి వెంట రాదు. లోకములో పేరు కలుగచేయదు, పాపములను పోగొట్టదు. మనకు అవసరమైనప్పుడు శివుని చూపించదు. సంసారము సారమనుచు, సర్వస్వమనుచు దురాశను పెంచుకొన్న నాకు, ఈ దురాశను నాశమొనర్చి మోక్షమొసగుము తండ్రీ.

73. ఒక పూటించుక కూడు తక్కువగునే నోర్వంగలే, దెండకో
పక నీడన్వెదకుం, చలింజడిసికుంపట్లెత్తుకోజూచు, వా
నకు ఇండ్లిండ్లు నుదూరు, నీతనువు దీనన్వచ్చు సౌఖ్యంబు రో
సి కడాసింపరుగాక మర్త్యులకటా: శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నా ఈ సుకుమార శరీరము తిండితక్కువైతే ఓర్చుకోలేదు. ఎండను భరించ లేదు. చలికి తట్టుకోలేదు. వానకు తడవ లేదు. ఇలా ఏ మాత్రముకష్టనష్టములకు ఓర్వలేకపోవుటచే దీని పోషణ యందే మునిగి అంత్యకాలమందు కోరుకొనదగ మోక్షమును కోరుకోలేకున్నాను. నావలెనే ఇతర మానవులుకూడ. మాకు మోక్షాసక్తిని కల్పించు భారము నీదే స్వామీ!

74. తమకంబొప్ప, పరాంగనాజన పరద్రవ్యంబులన్ ముచ్చిలం
గ మహోద్యోగముసేయు నెమ్మనముదొంగంబట్టి వైరాగ్య పా
శములంజుట్టి బిగించి నీదు చరణ స్తంభంబునంగట్టి వై
చి ముదెంబెప్పడు గల్గఁజేయగదవో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ ఈశ్వరా! నా మనస్సు చోరుని వలె పరస్త్రీలకు, పర ద్రవ్యములకు ఆశపడుచున్నది. దానిని నీవు వైరాగ్యమనే త్రాళ్ళతో బంధించినీ పాద సన్నిధి యను సంతోషమును కలుగజేయవలెను.

75. పుడమి న్నిన్నొక బిల్వపత్రమున నే పూజించి, పుణ్యంబునుం
బడయన్నేరక పెక్కుదైవములకుం బప్పుల్ ప్రసాదంబులుం
గుడుముల్దో సెలు సారెసెత్తు లటుకుల్ గుగ్గిళ్ళనుం బెట్టుచుం
చెడి, యెందుం కొరగాకపోదు రకటా శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! అకటా! ఈ మనుజులు ఎంత అజ్ఞానులయా! మీ నైవేద్యములకై తమ ఆస్తిపాస్తులను అమ్ముకొనుచూ మీకు అవి ఇష్టము, ఇవి ఇష్టము అనుచూ పప్పులు, ప్రసాదములు, ఉండ్రాళ్ళు రొట్టెలు అటుకలు, గుగ్గిళ్ళు మొదలగునవి సమర్పించుటకు ఇష్టపడుదురే గాని మారేడుదళ మొక్క దానిచే నీవు సంతృప్తి చెందుతావని తెలుసుకోలేకున్నారు.

76. విత్తజ్ఞానము పాదనిత్యము, భవావేశంబు రక్షాంబువుల్
మత్తత్త్వంబు, తదంకురంబన్యతముల్, మారాకులత్యంత దు
ర్వృత్తుల్ పువ్వులు పండ్లు మన్మథముఖా విర్భూత దోషంబులుం,
చిత్తాభ్యున్నత నింబ భూజమునకున్, శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! అజ్ఞానాంధకారము ఆవరించి యున్న నా మనసులోని వేపవృక్షమునకు అశాశ్వతమైన విషయములే పాదు, ఆవేశమే కంచె, అసత్యములే మొలక, చెడు పనులే ఆకులు, కామసంబంధమైన చెడు పనులే పువ్వులు, పండ్లు , అట్టి వృక్షమును తొలగించి జ్ఞానవృక్షమును నా మనస్సులో పాదు కొల్పవలసినది.

77. సంపద్గర్వముబారద్రోసి, రిపులన్ జంకించి, యాకాంక్షలన్
దప్పన్వెట్టి, కళంకముల్నఱికి, బంధుక్లేశ దోషంబులన్
చింపుల్జేసి, వయోవిలాసములు సంక్షేపించి, భూతంబులన్
చెంపల్వేయక నిన్ను గాననగునా శ్రీకాళహస్తీశ్వరా!

ఓ శంకరా! నిను చూచుటకు సాధ్యపడవలెనన్న సంపదలనెడి గర్వమును అణచివైచి, అరిషడ్వర్గములను జయించి, కోర్కెలను పారద్రోలి, దేహములను తెగనరికి, భావములను చీల్చిచెండాడి, కామపరమైన చేష్టలను కుదించుకుని, చెంపలు వాయించుకోవాలి. ఒక్క నీ నామామృత పానము చేతనే సాధ్యపడును కదాస్వామీ!

78. వన్నే యేనుగుతోలుదుప్పటము, బువ్వాకాలకూటంబు, చే
గిన్నే బ్రహ్మకపాల ముగ్రమగు భోగే కంఠహారంబు, మే
లిన్నీ లాగుననుండియుం తెలిసియున్నీ పాదపద్మంబులన్ చే
ర్చెన్నారాయణుడెట్లు మానసముదా శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! సిరికి పతియైన శ్రీమన్నారాయణుడు విరాగి వైన నిన్ను - ఏనుగుతోలు దుప్పటి, కాలకూటవిషాహారము, పాములాభరణములు, చేత బిక్షాపాత్రతోనున్న నిన్ను - ఏరీతిగా విడువకుండాపూజించునో అట్లేనాకు కూడ నీయందు భక్తి నొసగవలసినది.

79. కేదారాది సమస్త తీర్థములు కోర్కొంజూడ బోనేటికిన్?
కాదాముంగిలి వారణాసి, కడుపే కైలాసశైలంబు, నీ
పాదధ్యానము సంభవించునపుడే భావింప నజ్ఞాన ల

క్ష్మీ దారిద్రులుగారె లోకు లకటా శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! నీపాదములందు ధృఢమైన భక్తికల్గిన వారికి 'కాదాముంగిలి వారణాశి కడుపే కైలాసశైలంబు' - ఇంటివాకిలి కాశీక్షేత్రము, కడుపు కైలాసశిఖరము కదా! ఇట్టి దృఢ భక్తి కల్గిన వారు అజ్ఞాన లక్ష్మిని పోగొట్టుకొని జ్ఞాన సంపద గల్గిన వారగుదురు. ఇల్లే వైకుంఠము కడుపే కైలాసము అంటారు కదా!

80. ఊరూరం జనులెల్ల భిక్షమిడరో, యుండం గుహల్గల్గనో
చీరానీకము వీధులం దొరకదో, శీతామృత స్వచ్ఛవాః
పూరం బేరుల బారదో తపసులం బ్రోవంగ నీ వోపవో
చేరం బోవుదురేల రాజుల జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళ హస్తీశ్వరా! ప్రజల అజ్ఞానము నేమని చెప్పమందువు తండ్రీ. తినుటకు తిండికా వలెనంటే ప్రతి వూరునందు ప్రజలు బిచ్చము పెట్టు చుండగా, గుహలు నివాసమున కుండగా, నదులు తాగుటకు నీరిచ్చు చుండగా, రాజాశ్రయమునకై పాకు లాడుట ఎందుకు?

81. దయఁజూడుండని గొందరాడెదరు, నిత్యంబు న్నినుగొల్చుచున్
నియమంబెంతో ఫలంబునంతియెగదా? నీవీయంపిండెంతో యం
తియకా నెప్పటికిం దళంబశనబుద్ధింజూడ నేలబ్బు స
త్క్రియలన్నిన్ను భజింప నిష్టసుఖముల్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! 'పిండి కొలది రొట్టె' అనునట్లుగా 'ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన అంతమా త్రమే నీవు' అనునట్లుగా ఎవరెవరు ఎంతెంత నిన్ను పూజించిన అంతంత ఫలముల నొసగుదువు కదా. అందుకని మంచి పనులు చేస్తూ నిన్ను సేవిస్తే మాకు కోరిన సుఖములు కూడా నీదయ వల్ల లభించును కదా.

82. ఆరావంబుదయించే తారకముగా నాత్మాభ్రవీధి న్మహా
కారోకారమకార యుక్తమగు నోంకారాభిధానంబు చె
న్నారు న్విశ్వమనంగ, తన్మహిమచే నానాదబిందుల్సుఖ
శ్రీరంజిల్ల గడంగు, నీవదె సుమీ! శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశ్వరా! అకార, ఉకార మకారములతో కూడిన ప్రణవనాదమైన ఓంకారమును జపించిన కల్గు బ్రహ్మానందస్థితికి మూలకారణమైన ఆనంద స్వరూపుడవునీవేసుమా.

83. నీ భక్తు ల్పదివేల భంగుల నినున్సేవింపుచున్ వేడగా
లోభం బేటికి, వారికోర్కులు కృపాళుత్వంబునం దీర్పరా
దా! భవ్యంబు దలంచి చూడు పరమార్థంబిచ్చి పొమ్మన్న, నీ
శ్రీభండారములో గొఱంత పడునా? శ్రీకాళహస్తీశ్వరా!

ఓ జగదీశా! నీ మోక్షసామ్రాజ్యధనాగారమునకు, నీ భక్తులకు పరమానందకరమైన మోక్షమిచ్చిన లోటు ఏర్పడుననియా నువ్విట్లు పిసినారివై నీ భక్తులకు మోక్షమును కొసరి కొసరి ఇస్తున్నావు?నీ భక్తులు నిన్ను ఎన్ని రకాలుగా పూజిస్తున్నారో చూస్తున్నావో కదా!

84. కాలద్వార కవాటబంధనము, దుష్కాల ప్రమాణక్రియా
లీలాచాలక, చిత్రగుప్త ముఖవల్మీకోగ్ర జిహ్వోద్ధృత
వ్యాళవ్యాళ విరోధి, మృత్యుముఖదంష్ట్రాహార్య వజ్రంబు ది
క్చేలాలంకృత! నీదునామమరయన్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! నీ నామామృత పానము యమకవాటము సంధించు శక్తికలది. చిత్రగుప్తుని ముఖమనే పుట్టలో నున్న నాలుక అనే పాము పాలిటి గరుత్మంతుని వంటిది. మృత్యుదేవత ముఖము నందు ఉన్న కోరలనే కొండల పాలిటి వజ్రాయుధం లాంటిది. అకాలమృత్యువును హరించునటువంటివి.

85. తాతల్ తల్లి యుతండ్రియున్ మరియుబెద్దల్చావగా చూడరో
భీతిం బొందగ నేల చావునకుగా, పెండ్లాము బిడ్డల్హిత
వ్రాతంబుల్తిలకింప, జంతువులకు న్వాలాయమై యుండగా
చేతోవీథిన్న రుండు నిన్గొలువడో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ఈశ్వరా! మరణ భయములేక మనుజుడునిన్ను పూజించుట మరచు చున్నాడుకదా! పుట్టిన ప్రతి జీవికి మరణము కల్గునుకదా! తాత, తండ్రి, బార్య, బిడ్డలు, హితులు, పశుపక్ష్యాదులు అందరికీ అతి సహజమైనది కదా!

86. జాతుల్సెప్పట, సేవచేయుట, వృషల్ సంధించుట న్యాయాప
ఖ్యాతిం పొందుట, కొండెగాడవుట, హింసారంభకుండౌట, మి
ధ్యాతాత్పర్యములాడుటిన్నియు పర ద్రవ్యంబునాశించి, యా
శ్రీ తానెన్ని యుగంబులుండగలదో శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! మానవుడు చంచలమైన లక్ష్మిని నమ్ముకొని ఎన్నోపాపములు మూటగట్టుకొను చున్నాడు. ఇతరుల ధనమును కాజేయుట కోసం గొప్పలు చెప్పుకొని, చాడీలు చెప్పి, లేనిది ఉన్నట్లు కల్పించటం చేస్తున్నాడు. సంపద తనవద్ద ఎన్ని యుగములుండుననుకొనుచున్నాడో!

87. చెడుగుల్ కొందర గూడి చేయగ పనుల్ చీకట్లు దూరంగ బా
ల్పడితింగాన గ్రహింపరాని నిను నొల్లంజాలఁ బొమ్మంచు ని
ల్వెడలంద్రోచిన జారుపట్టుకొని నే వ్రేలాడుతుంగోర్కెఁ, గో
రెడి యర్థంబులు నాకు నేల యిడవో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! అజ్ఞానాంధకారము కమ్ముకొన్న చీకటిలో, తెలివిలేక నేను చెడుపనులు చేసిన నూ నిన్ను మరువకుండటచే పుణ్యాత్ముడనైతి ననుకొంటిని. నీవు నేను కైలాసములో నుండుటకు తగనని తోసివేయగా చూరుపట్టుకు వేలాడుచుంటిని అయినా నీ నామమును జపించు నాకు మోక్షము నేల ఇయ్యవు?

88. జలజ శ్రీ గల మంచినీళ్ళు గలవా? చట్రాతిలో బాపురే
వెలివాడ న్మటి బాపనిల్లు గలదా? వేసాలు గాకక్కటా!
నలినా రెండు గుణంబు లెంచి మదిలోనన్నేమి రోయంగ నీ
చెలువంబైన గుణంబులెంచుకొనవే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ఈశ్వరా! ఎక్కడైనా బండరాళ్ళలో పద్మములతో కూడిన మంచినీళ్ళుండునా? మాలపల్లెయందు వేషములేకాని బ్రాహ్మణ కొంప ఉండునా? నాయందు మంచి గుణములుండునా అని ఆలోచించకు. భక్తవత్సలుడవైన నీవు నాభక్తియనెడి ఒక్క మంచిగుణమెంచి మిగిలిన దుర్గుణములను లెక్కింపకనాకు మోక్షమొసగవలెను.

89. ఘడియల్ రెంటికొమూటికో ఘడియకోకాదేనినేడెల్లి యో
కడనేడాది కో యెన్నడో ఎరుగమీ కాయంబు లీ భూమి పై
బడగానున్నవి, ధర్మమార్గమొకటిం బాటింపరీ మానవుల్
చెడుగుల్ పదభక్తియుం దెలియరో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! మరణము నిత్యమని, సత్యమని ఎరుగ లేక దుర్మార్గులు నిన్ను మరచి తమ పాపములందే మునుగుచున్నారు. ఒక్క ధర్మమును కూడా పాటించుటలేదు. తండ్రీ! అందరినీ కాచు దైవ ము నీవే కదా!

90. సలిలమ్ము ల్చిలుక, ప్రమాణమొక పుష్పమ్ము న్గవన్మౌళి ని
శ్చలభక్తి ప్రతి పత్తిచే నరుడు పూజన్సేయగా ధన్యుడౌ
నిల గంగాజల చంద్రఖండముల దానిం దుదిం గాంచు నీ
చెలువంబంతయు నీ మహాత్మ్యమిదిగా శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! పత్రం, పుష్పం, ఫలం, తోయమని ఇందులో ఏ ఒకటైనా నీకు సమర్పించిన మానవుడు కైలాసము చేరి నీ జగన్మోహనరూపమును కన్గొన గలుగు చున్నాడు కదా! నీ మహత్యము ఏమని పొగడకల్గుదునో కదా!

91. తమ నేత్రద్యుతి దామెచూడ సుఖమై దాదాత్మ్యమున్గూర్చగా
విమలమ్ముల్కదు లాభముల్జిత లసద్విద్యుల్లతా లాస్యముల్
సుమనోబాణ జయప్రదమ్ము లనుచున్ చూచున్ జనంబూనిహ
రి మృగాక్షి నివహమ్ము కన్నుగవలన్ శ్రీకాళహస్తీశ్వరా!

ఈశ్వరా! ప్రజలు స్త్రీలోలురై జీవాత్మ, పరమాత్మల సంయోగము తమ కనులతో కనలేక మెలగు చున్నారు. నీ పదధ్యానము మరచుచున్నారు. పద్మమువలె కాంతి కలవి, మెరుపు తీగల విలాసములు కలవి, మన్మధునకు జయమును కలుగ జేయునవి అంటూ స్త్రీల కనులను తమ కన్నుల నిండా నింపు కుని చూస్తున్నారు.

92. వేధం దిట్టగరాదు గాని భువిలో విద్యాంసులంజేయనే
లాధీ చాతురింజేసినన్ యటుల నా బాటంచు నేఁబోకక్ష
ద్బా ధాదుల్ కలిగింపనేల యది కృత్యంబైన దుర్మార్గులం
యీ ధాత్రీశుల చేయనేటి కకటా శ్రీకాళహస్తీశ్వరా!

ఓ పరమేశా! బ్రహ్మదేవుని తిట్టలేముకాని మనుజులకు ఈతిబాధల నొసగి వానిని తీర్చుటకు రాజుల నాశ్రయించునట్టుగా చేయనేల? నీ పదధ్యానము చాలదా. మమ్ములను పండితులను చేసినచో, ఆ పాండిత్యమువలన కలిగిన జ్ఞానముతో నిన్ను సేవించేవాళ్ళము కదా!

93. నిను నిందించిన దక్షుపై దెగవొ, వాణీనాథు శాసింపవో,
చనువా నీ పద పద్మ సేవకుల తుచ్ఛంబాడు దుర్మార్గులం
బెనుప న్నీకును నీ (దుభక్తతతికిన్ భేదంబుగానంగ వ
చ్చెనొ, లేకుండిన నూరకుండగలవా! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! నిన్ను తూలనాడినందుకు బ్రహ్మదేవుని, దక్షప్రజాపతిని అణచి వేసితివి. నీ భక్తులను తూలనాడు వారి అభివృద్ధికి తోడు పడుచుంటివి. నీకు,నీ భక్తులకు తేడా చూపుటనీకు తగునా. అట్టి బేధము లేకపోతే నీ భక్తులను దూషించు వారిని శిక్షింపకుండా ఊరుకుంటావా?

94. కరిదైత్యు న్బొరిగొన్న శూలము కరగ్రస్తంబుగాదో, రతీ
శ్వరునిన్ కాల్చిన ఫాలలోచన శిఖావర్గంబు చల్లారెనో
పరనిందాపరుల న్వధింప విదియున్ భావ్యంబె? వారేమి చే
సిరి నీకున్టరమోపకార మరియన్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! గజాసురుని చంపిన శూలము మన్మథుని చంపిన కంటి మంటలు నేడు నిరుపయోగమైనవా! పరులను, నీ భక్తులను నిందించు వారిని వూరక వదలి పెట్టుచుంటివి. ఇది నీకు తగునా? నిజంగా పరిశీలిస్తే నీకు గజాసురుడు, మన్మథుడు ఉపకారమే చేసారు కాని వాళ్ళు నీకేం కష్టం కలిగించారు?

95. దురము, న్దుర్గము, రాయబారము, మరిన్దొంగర్కము, న్వైద్యమున్
నరనాధాశ్రయ, మోడబేరమును, పెన్మంత్రంబు, సిద్ధించినన్
అరయున్ దొడ్డఫలంబు గల్గు, నదిగాకా, కార్యమే తప్పినన్
సిరియుంబోవును బ్రాణహానియునగున్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా!గట్టి మేలుకలుగునట్టి పనులు- యుద్ధము చేయుట, కోటగట్టుట, రాయబా రము చేయుట దొంగతనము చేయుట, రాజులను ఆశ్రయించుట, ఓడలమీద వ్యాపారము చేయుట మొదలగునవి. ఇవి ఫలించెనా చాల మేలు కల్గజేయును. లేదా ప్రాణహాని మాన హాని కల్గవచ్చును.

96. తనయుంగాంచి, ధనంబునించి, దివిజస్థానంబు గట్టించి, వి
ప్రున కుద్వాహము చేసి, సత్కృతికి పాత్రుండై, తటాకంబునే
ర్పున ద్రవ్వించి, వనంబువెట్టి, మననీ, పోలెడు, నీ సేవ జే
సిన పుణ్యాత్ముడుపోవు లోకమనుకున్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ ఈశ్వరా! సప్తసంతానములు కల్గిన వాడు కూడా నిన్ను పూజించు పుణ్యాత్ముడు పోవుపుణ్య లోకములకు పోలేడు. మగపిల్లవానిని కనుట, ధనమును సత్కార్యమునకై నిక్షేపించుట, దేవాలయమును నిర్మించుట, బ్రాహ్మణపిల్లవానికి వివాహము చేయుట, మంచికావ్యమును అంకితము పుచ్చుకొనుట,

ఉపాయము చేత చెరువును త్రవ్వించుట, ఉద్యానవనమును నిర్మించుట - ఈ ఏడింటిని సప్త సంతాన ములంటారు.

97. నీకుంగాని కవిత్వమెవ్వరికి నే నీనంచు మీదెత్తితిన్
చేకొంటిన్ బిరుదంబు, కంకణము ముంజేగట్టితిం, బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు, నాతనువుకీడుల్ నేర్పులంగావు, ఛీ
ఛీ! కాలంబులరీతి దప్పెడుజుమీ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! నాకవిత్వము నీకే అంకితమియ్యవలెనని నియమము పూని ముడుపు కట్టాను. నలుగురికి తెలిసేలా కంకణమును ధరించి దీక్షను పొందాను. ఎట్టి కష్టములు ఈ విషయమున నా శరీర ము నంటదనుకున్నాను. జనులుమెచ్చునట్లుగా రచించినను కాలపరిణామము వలన నానియమ భంగ ము జరుగ వచ్చును సుమా.

98. నిచ్చల్ నిన్ను భజించి చిన్మయ మహానిర్వాణపీఠంబు పై
రచ్చల్సేయక, యార్జవంబు కుజనవ్రాతంబుచేగ్రాగి, భూ
భృచ్చండాలురగొల్చి, వారు దనుగోపింపన్, బుధుం డార్తుడై
చిచ్చారం జమురెల్ల జల్లుకొనునో శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! పండితోత్తములు నిను సేవించి బ్రహ్మానందస్థితిని పొందక, నీచులైన రాజుల సేవించి ఆరాజులు కోపింపగ దుఃఖితులగు చున్నారు. నిప్పును ఆర్పుటకు ఎవరైనా నూనె చల్లుదురా? అట్లు చల్లితేమంట పెరుగును. అట్లే రాజుల వల్ల దుఃఖమే కాని నీ వల్ల లభించే బ్రహానందము లభిం చదు. అట్టివారిని కూడ నీ పాదసన్నిధిని చేరు కొమ్ము తండ్రీ.

99. నీపై కావ్యము జెప్పుచున్న యతడు న్నీ పద్యముల్ వ్రాసి యి
మ్మాపాఠంబొనరింతునన్న యతడున్, మంజు ప్రబంధంబుని
ష్టాపూర్తింబంఠియించుచున్నయతడున్; సద్బాంధవుల్ గాక, ఛీ
ఛీ! పృష్ఠాగల బాంధవంబు నిజమా! శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! పుట్టుక ననుసరించి వచ్చిన బంధుత్వముల కన్నను భావముల బంధుత్వము మిన్న యైనదిసుమా! ఎవరు నీ మహిమను వర్ణిస్తూ గ్రంథములు వ్రాయునో, నీ మీద పద్యములు రాసి యిస్తే ఎవరు పారాయణ చేస్తారో. మనోహరముగా నీ మహిమను వర్ణిస్తూ వ్రాయబడిన ప్రబంధము నునియమ నిష్టలలో పఠిస్తారో, వారే భావబంధువులు.

## 100. దంతంబుల్పడనప్పడే, తనవునం దారూఢి యున్నప్పడే
## కాంతా సంఘము రోయనప్పడే, జరాక్రాంతంబు గానప్పడే
## వింతల్మేన చరించనప్పడే కురుల్వెల్ల గానప్పడే
## చింతింపన్వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరా! ఎప్పుడో ముసలి తనము వచ్చును అపుడు భగవన్నామ స్మరణ చెయవచ్చును అనుకొనక శరీరము పూర్తిపటుత్వములో నున్నపుడే, దంతములు ఊడిపోక ముందే, స్త్రీలు అసహ్యించుకో కముందే నీ నామ స్మరణ చేసి మోక్షమునొందవలనెను.

********

శ్రీకృష్ణ దేవరాయలంతటి వాడు మన సారా మెచ్చుకొన్న కవి ఈ ధూర్జటి. ధూర్జటి కవి పల్కులకే లకల్గె ' అతులిత మాధుర్ మహిమ' ఈ మాధుర్ మహిమ' కల్గుటకు కారణము ఈతనికి తోటి మనిషి యందు కల్గు ప్రేమయే. ఈతని శతకమంతయు అందరిని బ్రోచుమనియే కాని, తనకే సాక్షాత్కార మిమ్మని, తనకే మోక్షమొసగమని కాదు. పాపాత్ములను కూడ బోచుదైవము నీవేయని చెప్పినాడు. 'తప్పు లు చేయుట మావంతు, దండన బొందుట మావంతు దయ చూపటయే నీ వంతు' అని దేవునితో బేరము లాడగలిగిన దిట్ట. నీ వెందుకీ పని చేయలేదని దేవుని నిలదీయగలధీశాలి.' నిన్ను తిట్టిన ఏల దండించవని' నిలదీసి అడిగిన ధీమంతుడు. నీవెంత విరాగి యైనా సరాగులైన శ్రీమన్నారాయణుడు, కుబేరుడు మొదలగు వారు నిన్నాశ్రయించున్నారుకదా! మేమాశ్రయించిన దోషమేమి అని ఒక చోట అడుగు చున్నాడు. ఇంకొక చోట అయ్యో! నీ వంటి వానికి ఎంగిలి కూడు తగునయ్యా! అన్నియు నిన్నాశ్ర యించు కున్నవే కదా! ఇతరుల ఎంగిలి నీకెందుకయా అని వాపోవు చున్నాడు. ఎంతటి భక్తి పారవశ్యము లో మునిగి యున్ననూ సాటి మానిషిని కూడ రక్షింపమని కోరుతూ, నీ నామస్మరణే ముక్తికి మార్గమని,

తీర్థయాత్రలు, నివేదనలు, పూజలు అటువంటి వాటి మీద కాలము వ్యర్థపరచవద్దని జనులకు తెలుపమని శ్రీకాళహస్తీశ్వరునే కోరుతున్నాడు. మానవులలో గొప్పవాడు రాజు, రాజులలో గొప్పవాడు రారాజు కావచ్చు గాని, శివుని ముందు వాళ్ళంతా దిగదుడుపే! వాళ్ళని పట్టుకుని అశాశ్వతమైన సంపద లక్ష్మిని కోరే బదులు శాశ్వతమైన బ్రహ్మానందాన్ని కలగించే జ్ఞాన లక్ష్మిని పొందాలందరు అన్న తపన గల వాడు. ఇటువంటి ధూర్జటి పలుకులు అక్షరరమ్యములు, పలుకుతేనెలు, సుధా మధుముల, అమృతపు చినుకులు.